సీ. చెలఁగి పువ్వులఁ గోసి చెలులపైఁ బడవేసి, కిలకిల నవ్వు నాకీరవాణి
మధురఫలంబులు మాటిమాటికిఁ గోసి, చెలుల కందిచ్చు నాచిగురుఁబోఁడి
లాలించి శేలించి నీలకంఠములతో, మేలంబు లాడు నానీలవేణి
రాయంచగతిపలె నాయెడ నటియించి, సారెకు సోలు నాజలజవదన

తే. కోరి కోవెలలట్లు తాఁ గూజితంబు, చేసి చొక్కుచుఁ బలుమాఱు చిలుకగముల
సరణిఁ బల్కుచు భృంగి నిస్వనము రీతి, గాన మొనరించు సొంపుగఁ బూని యచట.

క. మొల్లలు పొన్నలు పొగడలు, మల్లెలు సంపెంగ విరులు మందారములన్
గొల్లగఁ గరములఁ గోసి మ, ఉల్లాసము మీఱఁ బుడమి నొక్కెడఁ బెట్టున్. 230

క. ఒయ్యారంబున నడుచుచు, బుయ్యారంబుగ నెసంగుబోదరింటను దా
నుయ్యెల లూఁగును జెలులను, నెయ్యంబుగఁ బిలిచి యందు నెమ్మది తనరన్. 231

క. వింతగ మోసగపూల వ, సంతము చేయించి చెలులు సంతస మందన్
దంతపుఁజిమ్మనిగ్రోవులఁ, బంతంబుల జిమ్మిజిమ్మి పకపకనవ్వున్. 232

క. తెప్పున నేలను రాలిన, పుప్పొడి చేనంది మించి పొలఁతులపై మే
లొప్పఁగఁ జల్లుచు సుద్దులు, చెప్పుచుఁ గమలాకరంబు చేరుచు వేడ్కన్. 233

తే. చెలఁగుచును విప్రవనితల చెలులతోడ, వేడుకలు మీఱఁగా జలక్రీడఁ గొంత
తడవు సల్పుచుఁ దీరంబుఁ గడకఁ జేరఁ, దడిసిన శరీర మెల్లను దడయ కపుడు. 234

సీ. తరుణికి మృదులవస్త్రంబుతోఁ దడి యొత్తి, పట్టుపావడ మొలఁ గట్టె నొకతె
చలు వగు వలిపెపుసరిగ ముస్వాలువ నా, పట్టుపావడ మీఁదఁ గట్టె నొకతె
మొలనూలు నొడ్డాణమును దనుమధ్యము, నందుంచె నొకతె మఱందముగను
జిలిబిలితళుకొత్తు చెంగావి రవికను, బొంగుగ నమరించెఁ బొలఁతి యొకతె

తే. భాసురం బగు నూతనాభరణములను, బొసఁగ నంగాంగములయందుఁ బొందుగాను
బెట్టె నొక్కతె మణిపూలఁ జుట్టె నొకతె, నెమ్మొగంబును వలువచేఁ జెమ్మఁ దుడిచి.

సీ. తిలకంబు నిడె యొర్తు లలిఁ గన్నులకు నోర్తు, గాటుక నీటుగఁ గ్రాలఁ దీర్చె
పరిమళగంధ మాబాలికామణిమేన, నలసంగఁ జల్లఁగ నలఁదె నొకతె
చల్లనిగాడ్పులు మెల్లఁగ నొడలపై, నొలయంగ విసరెఁ బూవులను నొకతె
నెమ్మోము గనుఁగొన నద్దమును బట్టె, నిలువుటద్దము దెచ్చి పొలఁతి యొకతె

తే. రాజనందన కిమ్మాడ్కిఁ బ్రమద మారఁ, జెలులు సేయంగ బ్రాహ్మణస్త్రీలకెల్లఁ
బసపు కుంకుమ విరిసుల్లములు లలరఁ, గన్యకామణి యొసఁగె సద్వ్రతప్రముక్తి.

వ. అప్పు డవ్విప్రాంగనాశిరోమణు లా పద్మావతిని దీవించి రంతఁ దెచ్చిన భక్ష్య భోజ్యంబు లచ్చోటఁ గుడిచి చెలులు రచించిన పూఁబాన్పునఁ గూర్చుండఁ జేసి సుగంధోపేత మగువిడెయంబు లిప్పించి తాను విడెయంబు సేయుచున్న సమయంబున. 237

## శ్రీనివాసుఁడు వేఁటాడుట.

సీ. దైవయోగంబునం దనసమీపమునకు, నురుతరజవనాశ్వ మొకటివచ్చి
నిలువఁగ దానిపై నీరజాక్షుం డెక్కి, చని వనగిరులందు సంచరించి
సారంగభల్లూకచమరీశరభసింహ, శార్దూలముఖమృగసంఘములను
వేఁటాడుచుండె నావేళ నందొకమద, కరి చక్రి నెదిరించె గహనమందు
తే. దానిసమయింప సమకట్టి దానివెంట, నరుగ నది పర్వతముడిగి యరిగెఁ జక్రి
తత్తిమి వెంబడి యోజనార్ధంబుపోయి, చేరెఁ బద్మావతిగలశృంగారవనము. 248
తే. చెంగటం జేరి ఘీంకృతిఁ జేయ గజముఁ, జూచి పద్మావతీదేవి చొప్పరయుచుఁ
జెట్లచాటునఁ జేరఁగఁ జెలులు నట్లు, చేర యిట్లనిపల్కిరి చిత్రపడుచు. 249
సీ. అతివలారా చూడుఁ డబ్బురంబుగ నాము, యేనుంగువచ్చె నిఁకెట్టులమ్మ
కన్నులు దెఱచి చక్కఁగ దానిఁ జూడక, తలకు నేలకు నంచి తలఁగ మేలు
నడుమఁ బద్మావతి నిడికొని చుట్టును, మన ముండఁబోదము మంచిదమ్మ
మనమెట్టులైనఁ బద్మావతిం దనరార, రక్షింతమమ్మ ధైర్యంబు మించి
తే. యనుచు నొండొరు లిమ్మెయి నంచునుండ, ఘనతరం బైనగుఱ్ఱంబు గ్రక్కునవచ్చె
దానిపై నొక్కపురుషుండు దఱుముకొనుచు, వచ్చుచున్నాఁడు గూర్చుని వనితలార.
వ. అట్లు చెప్పుకొనుచుండుసమయంబున నగ్గజంబు తన్నుఁ దఱుముచు వెంబడివచ్చు
హరిం జూచి భీతిల్లి తనకరంబు పైకెత్తి దండంబు వెట్టినం జూచి హరి కరుణించి
తఱుమక నిలిచె నంత. 251
క. హరి తన్నుఁ గరుణ విడువఁగఁ, గరివరుఁ డటుపోయి పెద్దకాననమందుం
జొరఁబడె నావల నచ్చట, సరసిజనాభుండు పొదలచాటున డాఁగెన్. 252
వ. అంత నందున్నకాంత లాదంతిని తురంగంబును బురుషుని గానక వెఱఁగంది యిట్లని
కొనిరి. 253
సీ. అమ్మలారా చూడుఁ డచ్చట గజతురంగంబులఁ బురుషుని గాన మిపుడు
మాయగ నున్నది మహిమ యేమనువారు, నదియెట్టికల్లపో యనెడువారు
భ్రాంతిఁ బొందితిమంచుఁ బకపకనగువారు, కలఁగంటిమో యని పలుకువారు
సొలసి నిద్దురవోక గలగా దనెడివారు, నహహ యేమిచిత్ర మనెడువారు
తే. నంద అన్నివిధంబుల ననఁగ నవ్వి, చెలులఁ గన్గొని డగ్గఱఁ జేరఁ బిలిచి
యనియెఁ బద్మావతీదేవి మనకు దేల, యెట్లుపోయినఁ బోనిండు నిపుడు మనము. 254
వ. అని తొల్లియట్లం గూర్చుండి చదరంగము సంతసంబార నాడుచుండె. 255
సీ. శృంగారవని నిట్లు చెలులతోఁ జదరంగ, మాడుపద్మావతి యంద మలరఁ
గాంచి త్రిదూపరేఖావిలాసము లన్ని, పొదలమాటునఁ జూచి పొసఁగఁ జక్రి

తనమదిలోఁ దాన తలఁచె నిట్టులన హా!, యీరాజకన్యక యెలమిఁ బ్రాయ
మును జూడ రతికన్న ముదిత భారతికన్న, నరగౌరికన్న శ్రీవనితకన్న
తే. నతిశయంబైనయందంబు నలరియున్న, దెట్లు నను జూచి మోహించు నిపుడటంచుఁ
దలఁచి యాయింతి నెమ్మోము దశకుఁ జూచి, యిట్లు వర్ణించె ముదమార నెట్టుసనక.
సీ. పాదజంఘోరువు ల్పల్లవకాహళ, కరికరంబుల భంగపఱచి మించు
కటిమధ్యకుచయుగ్మగౌరవంబులు చక్ర, మృగపకందుకముల నొగి జయించు
హస్తకంఠమనోహరాననంబులు కంజ, కంబుసోములను జక్కఁగ జయించు
భాసురాధరదంతనాసికేక్షణములు, ఫలకుందతిలపుష్పములను గెల్చు
తే. నింతచక్కని లలితాంగి యెచటగాని, మాపితే దీపనంబునం జూచినాఁడ
నిట్టిసుందరి నానఁ జెట్లు దీర్చె, నగుచు మెచ్చుచు మఱి యిట్టులనియె మెచ్చి.
సీ. కర్ణనేత్రభ్రూయుగములు శ్రీకారాబ్జ, పత్రికందర్పచాపముల గెల్చుఁ
గాంతిసాంద్రఘననీలకుంతలంబులు హేమ, పాటలబంభరప్రభల నడఁచు
గమనభాషణనిరీక్షణములు గలహంస, కలకంఠమునికాస్త్రముల నదల్చు
శాంతిసుస్మితగానసరణులు హర కౌము, దీపికలను జాల ధిక్కరించు
తే. నహహ యీకాంతరూపంబు నవనియందు, హాటకము మెత్తఁగా నూఱి యమృతరసము
పోసి మెదిచి మహాచిత్రముగ నజుండు, నేను మెచ్చుటకై చేసి నిల్పినాఁడొ. 258
క. అటుగాకుండిన నిజముగ, నిటువంటి శరీరకాంతు లింతులకు మహిం
బటిమగనుండునె యిమ్మెయి, నిటు లాత్మజుఁడు దీనిబాగడ నేరఁడు చూడన్. 259
సీ. కమలాసనుఁడు సర్వకాంతిసంచయమున, నతులితసౌందర్యవతిని దీర్చి
కమలమునం దిడఁగాఁ జూచి యాకొని, నరపతి గైకొనె నా కటంచుఁ
గావున దీని శీఘ్రంబుగ నేఁ బెండ్లి, యాడెదనని మోహ మగ్గలింప
నంతఁ బద్మావతిచెంతకు మెల్లఁగఁ, బోవుచు నందంపుఁ బూలఁ గోసి
తే. పాలఁతి నీకిటు తలఁబ్రాలిఁబోతు ననెడు, సైగఁ గాఁ బుష్పములఁ గొని చల్లు చోరిమ
సేయుచును మించి రా చూచి చెంతఁ జేర, నపుడు దగ్గున నా లేమ యతని జూచి.
తే. పసిఁడిచెఱఁగు ఱరవ సెల్ల పైన వేగ, పాదువుగాఁ గప్పుకొని పూలపొదమఱుఁగున
నిలిచి యసుకుచు బెళుకుమ తెలుల జూచి, చిలుకవలె ముద్దుపల్కులఁ బల్కె నిట్లు.
ఉ. అరమఱలేక రాజసుత లాడుచునుండెడుచోటు కీగతిం
బరపురుషుండు రాఁదగదు భామినులార భయంబునొంది తాం
దరఘడిల రావలసు దవ్వుగ నేగు మటంచుఁ జెప్ప న
[illegible]గా నపుడు ధైర్యముతో హరి గాంచి నవ్వుచున్. 262
క. [illegible] దద్దుగ, నాపాలఁతులు నిలిచి హరికి నగుపడకుండం
[illegible]పించి కోపమున నా, శ్రీపతి నీక్షించి చాలఁ జిడిముడి పడుచున్. 263

సీ. పలికి రిట్లని రాచపట్టి యింగుండఁగఁ, బరుఁడ వొక్కింతను భయములేక
వచ్చితి విప్ర డావల కేగుమంచును, వలుముచు రాఁగ నా దైత్యరిపుఁడు
నగవుతో నిట్లనె నలినాక్షులార మీ, రాజపుత్త్రినిజూచి గమింపఁ జెలంగ
మాటాడవచ్చితి మాటలాడక మీరు, పొండన నారాజపుత్త్రిఁ గాంచి
తే. చెలులతో నసెనతఁడు మిమ్ము లికిపడఁగఁ, బలుకుచున్నాఁడు శబరుండు పాపమేమి
వీనిఁబొదువు లెవ్వరో వీఁడెవండొ, వీనికులగోత్రములు నేవొ విశదముగను. 264
తే. అడుగుఁడని రాజసుతపల్క నపుడు చెలులు, చక్రధరుదిక్కుఁదిరిగి యోశబరనీకుఁ
దల్లిదండ్రులు పేళ్లేమి దగకులంబు, గోత్రముచు చెప్పుమనఁగ వైకుంఠుఁ డపుడు.
ఉ. వారినిజూచి యిట్లనియె వారిజలోచనలార యిచ్చటం
…యార నాకులము గోత్రము లెల్లను జెప్ప దేను మీ
భూరమణాత్మపుత్త్రి నను బొందఁగఁ జేసితిరేని మీకు నేఁ
గూరిమి నిచ్చెదన్ ముదము గోరనవన్నియు నిశ్చయంబుగన్. 266
అనిచక్రి మఱల నిట్లనియె మాకులము శీ, తాంశుకులంబు వసిష్ఠగోత్ర
మగుతండ్రి వసుదేవుఁ డాదేవకీతల్లి, యగుహాలపాణి మాయన్నగారు
లలితురాలైనచెల్లెలు సుభద్రాదేవి, పావనుండైన గాండీవి మఱఁది
ధర్మరాజాదులు దగుబంధుజను లన్న, తెఱవలు నగుచు నీదేహమెల్ల
తే. నలుపిదే మన్న వెన్నుండు నగుచుఁ బలికె, గృష్ణపక్షము నడిరేయి గినిసి కూడి
నపుడు పుట్టితి గనుక దేహంబు నీల, మయ్యె నందున ననుఁ గృష్ణుఁ డనిరి బుధులు.
క. నాకులగోత్రము లిప్పుడు, మీ కెఱిఁగించితిని గనుక మెండొడ్డక మీ
రీకన్యకులము గోత్రము, నా కానరఁగఁ జెప్పుఁడనఁగ నగి చెలులెల్లన్. 268
తే. అనిరి చంద్రకులంబును నత్రిగోత్ర, జనితుఁ డాకాశరాజను జనవిభునకుఁ
బుత్త్రికామణియై పుట్టి భూతలానఁ, బెరిగి పద్మావతీ యనం బరఁగె వినుమ 269
తే. మేటిదై మము నొగిఁ జిన్ననాఁటనుండి, యొరిమమాతోడ నాటాడుచుండుమాకు
సకలవస్తువు లిప్పించు సఖ్యమెసఁగ, నెపుడు నీయమ్మ సదయ మమ్మేలుచుండు.
చ. అనవిని వెన్నుఁ డిట్లనియె నంబుజలోచనలార మిమ్ము నె
ల్లను గృప నేలుచున్నకమలాక్షిని సఖ్యము సేయవచ్చితిన్
ఘనముగ నన్నుఁ గూడుమని గన్గొని మీ వొరపట్టి కిప్పుడే
మన మలరంగఁ జెప్పుఁ డనుమానములేక యటంచుఁ బల్కఁగన్. 271
క. విని పద్మావతికోపం, బునఁ జెలులం బిలిచి దిట్టి పొమ్మను వానిన్
ఘనత సెఱుంగక యున్నాఁ, డని తాఁ బొమ్మనియె దూర మరు…
సీ. అనిన వెన్నుం డిట్టు లనియె నోలలితాంగి, నిష్ఠురంబేల నే నీకు …
మార్దవంబుగ మేటిమాటల నాడుము, చెలఁగి కన్యాపేక్ష గలిగి యి…

నచ్చెతి ననునీవు వరియించుటకుఁ దగు, పాత్రుఁడ నేగాని బరుఁడగాను
బాత్రదాన[illegible] ప్రభువుకు నిహపర, సౌఖ్యము ల్గల్గు నీజనకుఁ డెలమి
తే. నన్నుఁ గాంచినయప్పుడ నిన్ను నాకు, నీయఁ గోరును సందియం బేమిలేదు
చంద్రకులజుండ వేఁట వంశజుఁడఁగాను, నన్నుఁ జేకొను సరవి ననంగ నపుడు. 273
క. నీవు నిషాదుఁడ వయ్యును, నావిరియున చంద్రకులమువాఁడ నటంచున్
గావలసి పల్కెదవా విప్ర, డౌలఁ బో మ్మెనుటనుండ కల్పుఁడ మతియున్. 274
సీ. తగ వెఱుంగక తప్పుదారిసుద్దులు చెప్ప, కరుగు మాతండ్రి నీ విన్నమాట
విన్నను సంకిళ్లు వేయించుఁ గొట్టించు, నంతికుమున్న నీ వరుగు మిచట
హరి యిట్టులనియె నాయం దధర్మంబేమి, నే బ్రహ్మచారిని నీవు కన్య
నగుటచే నీవివాహము చేసుకొనుట ధ, ర్మముగాని యది యధర్మంబు గాదు
తే. నీవు నాయందు దయయుంచి నిష్ఠురోక్తు, లాడ కింపుగ ననుఁ బెండ్లియాడు మనినఁ
గనుబొమలు ముడివెట్టుచుఁ గన్ను లెఱ్ఱ, చేసి యాయింతి నక్రి నీక్షించి పలికె. 275
క. ఓరి నిషాదుఁడ నీ వీ, క్రూరపుమాటంటి వైనఁ గొట్టింపను బో
నూరక నీత్రోవం జను, మూరక మాటాడ నేల నొప్పమి గలుగున్. 276
వ. అనినవిని హరి యిట్లనియె. 277
క. చుట్టపుదాన వటంచున్, గట్టుగ నే నిన్ను వేఁడికొన్నంగున నం
గొట్టింపను మన్యునిచేఁ, గొట్టింపఁగ నేల నీవ గొట్టుము తరుణీ. 278
సీ. అని చక్రివలుకఁగ నాతి యిట్లనియె నీ, వీపేల మోదుగుపూలు వేసి
పలుమాఱు నాకుఁ గోపంబు పుట్టించెదవ, పిఁక జీవితెఱువు లేదేమొ నీకు
ఛీ పొ మ్మనఁగ హరి చిఱునవ్వు నవ్వుచు, నను జనించినవారు చనుట నిజము
గనుక చింతెక్కడఁ గలసినపిమ్మట, జగతి నుండిన మేలె చనుట మేలె
తే. రమణి నా కందుకై విచారంబు గలదె?, వినుము తలఁచినపని యైనవెనుక నీవు
పట్టి కొట్టిన దిట్టిన భయము లేదు, వేఱుమాటలు పల్కకు వెలఁది నీవు. 279
వ. అనినవిని పద్మావతి యిట్లనియె. 280
క. నాకడ నీ విటు ప్రేలుట, యాకాశనృపాలుఁ డెఱుఁగ నంతట ని న్నీ
లోకంబున మననీయఁడు, పో కష్టం బేల దూరముగ మేలొందన్. 281
వ. అనినవిని హరి నగుచుఁ బద్మావతి కిట్లనియె. 282
సీ. పుట్టినవారెల్ల [illegible] ,దెఱుఁగుదు నేను ని న్నెట్టులైన
విడువను [illegible] అధర్మాత్ముండు, గాన న న్బాధింపఁ డైనఁగాని
[illegible] భయము లేదు మఱేమి, ప్రియముగ నా కిచ్చి పెండ్లి సేయు
[illegible] నవఁగ నాపద్మాక్షి, యిట్లను నావేంక టేశుఁ డుండ

తే. కంచి శివరసుఁడు రంగఁ డంచితులయి, యుండఁగా నీకు నాతండ్రి యొప్పి దాన
మిచ్చునే పొమ్ము నీకేల యిట్టిభ్రాంతి, కానికార్యంబునకు నీవు పూనసేల. 283
వ. అనినవిని చక్రి యిట్లనియె. 284
క. పోపొమ్మని మొఁగమాటం, బీపట్లను నీకు లేక హెచ్చుగ నాపైఁ
గోపము చేసితి వని నిను, బ్రాపించక నేను బోను పద్మదళాక్షీ. 285
క. అనఁగాఁ బద్మావతి యి, ట్లనెఁ దలిదండ్రులను విడచి యకటా నీవి
ట్లనుట యసంభావితమై, చను మూరక లేనిభ్రాంతి సమకొననేలా. 286
వ. అనిన నాదైత్యారి మందస్మితవదనారవిందుండై యిట్లనియె. 287
చ. విను సతి నీవు నా కిటు వివేకము చెప్పితి వెంతచెప్పినన్
వనజభవుండు తానునుట వ్రాసినవ్రాతఫలంబు దప్పునే
నిను వరియించి పిమ్మటను నే నెటు వోయినఁగాని నేమమే
గనుక నిజంబుగాను నినుఁ గౌఁగిటఁ జేర్పకపోను జేడియా. 288

## పద్మావతి హరిపై ఱాలను రువ్వించుట.

అనీ పల్కుచు డగ్గఱకు వచ్చుటం జూచి పద్మావతి గోపోద్రేకియై చెలులం బిలిచి యీమనుష్యుని ఱాలంగొట్టి దూరంబుగఁ దఱుముఁడనిన వారలప్పుడు. తెప్పున ఱాల నందికొని యొప్పుమి గల్గునట్లు తప్పక గుఱిమీఱిగొట్ట నాహరిమీఁద శిలావృష్టి గురిసె నప్పు డప్పద్మాక్షుండు కార్యము తప్పె నని తలంచె నప్పు డప్పాలంతులు పాటవంబున మీటు ఱాలపోటులు నాట ఘోటకంబును దాఁటి పోనేరక నేలం బడియె. నంత శ్రీకాంతుండు హయంబును డిగి యూరక నారింజాచుచుండ నా పోటులు వాటంబుగ ఱాలనంది మఱి మఱి రువ్వుచుండిరి. అఱాలవ్రేటులు దప్పించుకొనుచు నిలువనేరక యుత్తరాభిముఖుఁడై వేంకటాచలంబునకు నెగ నెక్కుచుం దనకు నివాసం బైనవల్మీకంబునం బ్రవేశించి వకుళమాలిక సిద్ధంచిన [illegible]లపాన్పుపైఁ బ్రళయకాలంబున మహాబ్ధియందు వటపత్రంబునఁ బరుండిన [illegible]రమపురుషునిచందంబున శయనించియుండె. అంత నిక్కడ వనమధ్యంబునంగుఁ [illegible]లంజూచి పద్మావతి యిట్లనియె. 289
సీ. [illegible]లులార మాతల్లి చెప్పినమాటలు, వినకుండవచ్చి యీవిధముగాను
అనుభవించితిఁ గష్ట మమ్మమ్మ నేఁ జెల్ల, నీపుష్పవనమున కింకరాను
జాలు నిచ్చోటను శబరుఁ డాడినమాట, లప్పు డమ్మకు మీరు చెప్పవలదు
చెప్పిన మనకెల్ల సిగ్గుపా ట్లగునని, పలికి యందలమెక్కి [illegible]
తే. గుసుమఫలములఁగొన్ని చేఁ గొనుఁడటంచుఁ, బోయి మణిమందిరము చేరి [illegible]
దల్లికి నొసంగి యంతటఁ దానుబోయి, పాన్పుపైఁ జేరి హాయిగఁ బ[illegible]

వ. అనిచెప్పి హరి యొనర్చినకార్యంబులు విని సంతసించి హరి యాసల నేమిచేసెనని
యడుగ మునులకు సూతుం డిట్లనియె. 291

చ. మునివరులార మీ కిపుడు ముచ్చట మీఱఁగ నేను జెప్పెదన్
వినుఁడు పరాత్పరుండు హరి విష్ణుఁడు మర్త్యనిరీతిఁ గాముకుం
డనఁదగి మోహతాపమున నారట నొందుచుఁ బవ్వళించి యే
మనక ముసుంగువెట్టుకుని యార్తునికైవడిఁ జింతసేయుచున్. 292

తే. వేఁడినిట్టూర్పు విడిచి తా విసులపాన్పు, పైని బొరలుచు దీనునిపగిదినున్న
వకుళమాలిక యచటికి వచ్చి హరిని, గాంచి యిట్లనియెల్ల సత్కరుణ మెఱసి.

శా. అన్నా వేంకట లెమ్ము లెమ్మిపుడు నీ వాకొంటి వాలస్యమే
మన్నంబుం బరమాన్నభక్ష్యములు నీ కర్పింప నేఁ దెచ్చితిం
జెన్నొందన్ భుజియించు నీ వనఁగ నాశ్రీస్వామి మాటాడకే
కున్నం జూచి మనంబునన్ భయము పెంపొందంగ నాఁ డెంతయున్. 294

సీ. వికలత్వమునుబొంది వకుళమాలిక యిట్లు, లనియె నాతండ్రి నీ వార్తినొంది
కనులనీ రిటు నింపఁ గారణం బేమి చీ, వీవిధంబునఁ జింత యేలపడెదు
పగలు నిద్దురవోవఁ దగదని తెలిసి నీ, విప్పు డిమ్మాడ్కి నిద్రించుటెల్ల
విపులధైర్యస్థైర్యవీర్యంబులను వీడి, పోఁ జేసి దీనతఁ బొందుటేల

తే. లేచి కూర్చుండి నాదెస లెస్సచూచి, నీమనంబునఁ గలచింత నిశ్చయముగఁ
జెప్పుమని బుజ్జగింపఁగ శ్రీధరుండు, మాఱుపల్కక యుండె సమ్మదము లేక. 295

వ. అంత వకుళమాలిక భీతాత్మయై దగ్గఱఁ గూర్చుండి వెండియు నిట్లనియె. 296

చ. అడవికి వేఁటఁబోయి మఱి యచ్చటఁ గ్రూరమృగవ్రజంబునం
బొడగని భీతినొందితివొ ఘాతము సోఁకెనొ లేక తాలపై
వడి చెడి జాఱి నేలపడి వాఁగుల జేరితొ యేమి చెప్పుమా
కొడుక నిజంబు నాకు వ్వాగి గొబ్బున నిష్టచికిత్సఁ జేసెదన్. 297

సీ. పడిలేచియుండినఁ బర[illegible] మేనఁ బూసెదఁ, దైలంబుచేత రుద్దంగవలయుఁ
జట్రాతిమీఁదఁ గ్రచ్చిన జారి మ్రొగ్గినఁ, బొసఁగ వేఁడిజలంబు పోయవలయు
మృగభీతివ్యాధియాన నొగి నాటినట్లైన, నట్లన నడివీఁపుఁ దట్టవలయు
నదిగాక ఘాత మెందైనసోఁకిన ఘాతి, దెప్పునఁ బట్టి మంత్రించవలయు

తే. నిట్టి వాల్గుచికిత్సలన్నిఁ జేచికిత్స, చేయుదు నది నీవు నిజముగఁ జెప్పు మనినఁ
దెలియునే నామనంబున దిగులుదీర, నున్న దున్నట్లు చెప్పు నాకన్నతండ్రి. 298

తే. అనుచు నాపాదశీర్షపర్యంతమప్పు, డొనర నివురుచుఁ జెమటచే నుష్ణమైన
[illegible]మద్దున్నబలుకాలదెబ్బ లంటి, యుండుటం జూచి భీతిల్లి యూరకుండి.

వ. ఎట్టకేలకు నవ్వకుళమాలిక హరి కిట్లనియె. 300

సీ. ఓతండ్రి నీమేన నుష్ణపుస్వేదంబు, పొంగుచు నీరీతిఁ బుట్టుటేమి
మృదుశరీరమునందు మెండుగ జాలదె, బ్బలు దాఁకియున్న దీపాపమేమి
ధీరుండ వయ్యును దీనదశను బొంది, నీవిట్లు కన్నీరు నించుటేమి
కల్గినరీతి నిక్కముగఁ దెల్పుమటన్న, మాటాడ విపు డింతమౌనమేమి

తే. యనుచుఁ గప్పినవస్త్రంబు నవలఁదీసి, యొప్పుగా లేననెత్తి గూర్చుండఁజేసి
వేగ గదుములు తాఁ ద్రోసి వేఱవస్త్ర, మొకటి పైఁగప్పి చందనం బొడలనలఁది.

క. చల్లనిజలములఁ గన్నులు, మెల్లఁగఁ దా నివిరి నివిరి మేల్కొల్పుచు మే
ల్లొల్లలు గ్రుచ్చినమృగతర, పల్లవముల విసరివిసరి బడలికఁ దీర్చెన్. 302

క. హరి కిటు బడలిక దీరిన, సరవిగ వకుళాఖ్య యింతి సదయహృదయ యై
పరమాన్నము భుజియింపుము, కరసుత యనిపిలుప శిరము వంచినవాఁడై. 303

క. పంకజలోచనుఁ డుండఁగ, సంకటపడి వకుళ చాల జాలినివల్కెన్
మంకుతనము చేసెదవా, వెంకట నీమదిని యేమొ వింతజనించెన్. 304

మ. అని యాకాంత మఱిట్లువల్కె విను నీ వాకాన నెందేనియై
నను సౌందర్యవిలాసవిభ్రమకళానైపుణ్యము ల్గల్గు కాం
తను మోహంబునఁ జూచి వచ్చితివె? చిత్తం బందుఁ దద్రూపముల్
ఘనమై నిల్చెనొ నీయురస్థలమునన్ గామాస్త్రము ల్నాటెనో. 305

సీ. నాతండ్రి నీవు గన్నది కిన్నరాంగనో, గీర్వాణకాంతయో గిరులయందు
గ[illegible]ంపఁ జెంచితో గంధర్వకాంతయో, వనదేవతయొ లేక వగలుగుల్కు
నూర్వశియో మేనకో సర్వగుణములఁ దగినరంభయొ తిలోత్తమ ఘృతాచొ
పూని యీపదుగురలో నెవ్వరం జూచి, నీవు వచ్చితి వది నిక్కముగను

తే. జెప్పుమనివల్కెఁ దలవంచి శ్రీధరుండు, పలుక కూరక కనులబాష్పంబు లొల్క
దిగులువడియుండుచక్రిని తెగ మఱొక్క, సారి వీక్షించి పల్కెనో సత్కుమార.

తే. మోహినీభూత మేమైన ముంచునిలిచి, కనులఁ బొడఁగట్టిపోయెనో గహనమందుఁ
గామినీభూత మెంచేని గదసి నిన్నుఁ, బట్టెనో తెల్పు కొడుక మఱెట్టివిధము.

క. అటు గాకుండిన నాతో, నిటు మాటాడకయ యుండ నేవిధమున సం
కటపడ వెన్నఁడు దీనికిఁ, గటగట నే నేచికిత్సఁ గావింతునయా. 308

క. ఒకమాట నాకుఁ జెప్పక, వికలాత్ముఁడ వగుచు ఘనవివేకము గాఁ బ
ల్కక నీవుండఁగ నామది, కకవిక లొందినది నాకు గతియే మింకన్. 309

సీ. మౌనివై నీవిటు మాటలాడక యున్న, నిక్కడ మనకు దిక్కెవ్వరింక
నావరాహస్వామికైన నీవృత్తాంత, మెఱుఁగఁ జెప్పఁగఁ దీర దింకమీఁద

చ. అని హరి పల్కఁగా నకుళ యాతని నెమ్మొగమారఁ జూచి యి
ట్లనియెఁ గుమార నీవు గనినట్టి లతాంగికులంబు గోత్రముల్
వినవలెఁ దల్లిదండ్రులను వేడ్కనెఱుంగఁగఁ జెప్పు దానినిం
గనవలెఁ బెండ్లియాడఁ దగుకన్యక యైన వరింపఁగాఁ దగున్. 319

తే. దానిపేరేమి యుండెడుతా వదేది, చెప్పు మేర్పడ నేఁ బెండ్లి సేయు దిప్పు
డంచు వకుళాడ నాచక్రి యనియె జనని, వినుము చెప్పెదనని యప్డు వివరమెల్ల.

సీ. జనని యాక్రమము నిశ్చయముగ విను సుధా, కరునికులజుఁడు నాకాశరాజు
తనకు సంతతిలేక ఘనపుత్రికామేష్టి, దనరఁ గావింప నద్ధరణితలము
దున్నింప ననిలోఁ ద్రోయజ...దయించె, నాతోయజంబునం దామృగాక్షి
గనుపింపఁగాఁ దెచ్చి గగనాధిపుఁడు పెంచె, ఘనను బద్మావతి దానిపేరు

తే. పరఁగ దానికి నాకు దాంపత్యమటఁచు, నిశ్చయము చేసియుండెనా నేను బ్రతుక
గలను లేకున్న నిచ్చోట నిలువలేను, వనిత వైకుంఠపురి చేరవలయు గాక. 321

వ. అమ్మా! విను మక్కన్యకామణి లక్ష్మీసమానయగుంగావున జన్మాంతరపుణ్యంబునుగల పురుషునకు లభించుంగాని పెఱవారి కేల లభించు మత్పూర్వపరిపాకంబున నక్కన్య నీక్షించి సుభాషింపఁ గలిగె నట్టిసుందరిం జూచి విడిచివచ్చితి నిఁక నాకన్నోదకంబు లభిలషింప నప్పద్మావతి నాయందు ననురక్తిలేమి చెలులంబురిగొల్పి శిలావృష్టిం గురియించె నావృష్టి కోపంజాలక తురంగంబు పైఁబడి తెప్పున నిప్పర్వతం బారోహించి పునర్జీవితుండనైతి నజుం డట్టిసుందరింబుట్టించి కట్టిఁడిబుద్ధి నిచ్చి నాకింత కష్టంబువెట్టె మత్పూర్వతకం బింతకుఁ దెచ్చె బ్రహ్మయు నక్కాంతకును నాకు నప్పుడ సంధింపఁజేయక పోయె, నైన నీవు ...కన్యకారత్నంబును నాకు నొడఁగూర్చు బ్రహ్మాతంత్రంబును దోడ్పడ నెంచెద, నట్లు చేసితివేని మజ్జననీజనక సహోదరాది బాంధవులును, మద్భక్తులగు బ్రహ్లాద నారదాది పరమభాగవతోత్తములును, నీవ యని నిశ్చయింతు, ననేక గోభూహిరణ్యాన్నదానాదులఫలంబు చేకుఱు, నాచేఁ బద్మావతికంఠంబున మాంగల్యంబిడఁ జేసిన మంతియ చాలునని మఱియు నిట్లనియె.

తే. తగిన శుభలగ్నమున నాకు దాని కీవు, పెండ్లి చేయించినంతకుఁ బ్రీతి నాకుఁ
గలుగ దేలోక మొందెనఁ గనుక వేగ, నాకుఁ బెండిలి సేయించు నయనిధాన. 323

మ. హరి వేడ్కన్ వచియింప నవ్వకుళ నెయ్యంబారఁగాఁ బుత్రికా
పరమాశ్చర్యముగా ధరాతలములోఁ బద్మంబునం దట్టిసుం
దరి బుట్టం దగుహేతువే మిపుడు మోదం బొప్పఁగా నాకు నీ
వారిమం జెప్పుమటన్నఁ జూచి హరి యిట్లొప్పారఁగాఁ బల్కెఁ దాన్. 324

## హారి వకుళకు రాములకథ చెప్పుట.

సీ. వినవమ్మ తొల్లికాలమున నప్డు త్రేతాయు, గంబున జరుగ శ్రీకరుఁడు ఘనుఁడు
దశరథేశ్వరునకుఁ దనయుండనై పుట్టి, గాధేయుసవనంబు గాచి శివుని
చాపంబుఁ ద్రుంచి యాజనకాత్మజను బెండ్లి, యాడి సాకేతాఖ్య నగుపురంబు
చేరి మజ్జనకాజ్ఞ శిరసావహించి నీ, తను లక్ష్మణుని దోడుకొని వనముల
తే. కరిగి యందుండ నొక్కమాయామృగంబు, నచట జానకిచూచి నెయ్యమున దాని
దెచ్చియిమ్మనియడుగ మేమచ్చటుండి, పోవ దశకంధరుఁడువచ్చి పొలఁతి[illegible].

సీ. ధరణిజ నెత్తి రథంబుపై నిడుకొని, చనఁగ రామా యని జనకపుత్త్రి
విలపింప నెవరును విడిపింప లేకున్న, నప్పు డగ్ని దేవుఁ డయ్యనిమిషారిఁ
జేరి దశగ్రీవ సీతగా దీకాంత, మఱి యెవ్వరన్న నెమ్మదిగ వినుము
చెప్పెద రాముఁ డాసీతను నాచెంతఁ, జేర్చి విప్రాంగన సీతవలెను
తే. జేసి యందుంచి చనియె నీస్నేహ మేను, గోరి చెప్పెద నీరీతి గుట్టటంచు
శాంతముగఁ జెప్పి సీతవేషంబు వేద, వతికిఁ గల్పించి తెచ్చి రావణునికిచ్చె. 826

క. ఆమూఢుం డగురావణుఁ, డామైథిలి నచట విడచి యావేదవతిం
గామించి తోడుకొని చనె, నేమఱక యశోకవనిని నెలమిగ నుంచెన్. 827

క. రామా యని పేర్కొంచును, నామైథిలిరీతి నచటఁ దల్లడఁబడుచున్
నేమము కించుక దప్పక, యామానిని చెఱనునిల్చి యడలుచు నుండెన్. 828

క. అనలుఁడు తనసతిచెంగట, నొనరఁగ జనకజను దాఁచియుండఁగ నే నా
యనిమిషవైరిని గనుమట, కనిమిషపతి సుతునిద్రుంచి యాసుగ్రీవున్. 829

సీ. చేఁబట్టి లవణాబ్ధి చెచ్చెర బంధించి, కనసి రావణకుంభకర్ణముఖ్యు
లగురాక్షసులఁ ద్రుంచి యందఱు మెచ్చుట, కై యందుఁ జెరనుండునట్టిసతిని
గాంచి నీ వగ్నిలోఁ గాఁ బ్రవేశించి వ, చ్చినఁ గాని నిన్నుఁ జేకొన నటంచుఁ
బల్కఁగ నయ్యింతి పావకజ్వాలల, యందుఁ బ్రవేశించె నంతఁ గన
తే. నప్పుడిద్దఱు సీతలై యగ్నియందు, నిలిచి యుండఁగ జనకజ నేను బిలిచి
చేడె నీవలెఁ జెంతను జేరియున్న, కమలలోచన యెవతె నిక్కముగఁ దెల్పు. 830

సీ. అనవిని సీత యిట్లనె దశాస్యుఁడు నన్నుఁ, దెచ్చునప్పుడు నేను దిగులునొంది
పరఁగ ని న్నేర్కొని పలువిధంబుల నేడ్వ, ననలుండు దనచెంత నప్పుడున్న
వేదవతిని దెచ్చి విబుధాహితున కిచ్చి, నను దనలో దాఁచికొనియె వేద
వతి లంకచేరి రావణునిచే హింసలు, వడియె నాకొఱ కిది భాగ్యవతియు
తే. నిన్నుఁ గోరి తపంబున్న కన్నె యిన్న, గనుక నీభావమందు సత్కరుణనుంచి
ప్రేమ మీరఁగ నిద్దానిఁ బెండ్లియాడు, మనఁగ నే నందు కొల్ల కిట్లంటి నపుడు.

తే. పడఁతి వినుమేకపత్నీవ్రతుఁడఁగనుక, యిప్పుడు నేఁబెండ్లియాడ నియ్యింగుముఖిని
రహిఁ దెలంగఁగ దేహాంతరమున దీని, పెండ్లియాడుదు వేడుక పెచ్చుపెరుఁగ.

వ. అదెట్లనిన నిరువదియెనిమిదవ ద్వాపరాంతకలియుగంబున ననేకభక్తరక్షణార్థంబు వేంకటాద్రియందు నవతరింతు నపు డీకన్యకను పెండ్లియాడుదు నంతపర్యంతంబు నీకాంత సత్యలోకంబున వసియించియుండవలయు, వేంకటాద్రియందుదయించిన నపు డియ్యింతి భూమియందు నుద్భవించు నపు డేను పరిగ్రహింతు. 333

క. అనిపల్కితి నీగోప్యం, బనలునకును నాకుఁ దెలియు నదిగా కిది యా
జనకజకును వేదవతికిఁ, దనరారఁగఁ దెలియు మర్త్యధర్మం బిదియుఁగా. 334

సీ. పరువెంతు వినవనీపరమరహస్యంబు, నీకుఁ జెప్పితి నేఁడు నెనరు మీఱి
మది నుంచు మఱుమీఁద మహిమ మీఱఁగ నేను, వహ్నియం దావేదవతిని నిల్పి
చిరతరకరుణ నాసీతను మెచ్చి చేఁ, బట్టి విభీషణుపట్టము చటుఁ
గట్టి సౌమిత్రితోఁ గపులతో సాకేత, పట్టణంబును జేరి ప్రజల నెల్లఁ

తే. పాలనము సేయుచుంటి నక్కాల మట్లు, జరిగె నటమీఁద నేను ద్వాపరమునందు
మునసి వసుదేవునకుఁ గృష్ణుఁడన జనించి, యుంటి వల్మీకమున నిందు నున్నవాఁడ.

తే. అనుచు వకుళకుఁ బూర్వవృత్తాంతమెల్ల, చక్రి వినిపింప నయ్యింతి సంతసించి
వేదవతిపూర్వవృత్తాంతవిధము తెల్పు, మనఁగ నాచక్రి యిమ్మాడ్కి ననియె నపుడు.

సీ. వినుము వకుళాదేవి ఘనపూర్వకథ నీకు, విశదీకరించెద విప్రకన్య
యగు వేదవతి నన్ను మగనిగ భావించి, తపము సేయుచునుండ దనుజవిభుఁడు
తా దాని గామింపఁగా దేహమందాశ, విడిచి యాలలితాంగి విశ్రవసుని
తనయుని గాంచి సిద్ధంబుగ హరిచేత, నిన్ను నే జంపింతు నెటేఁ దలంచు

తే. నంచుఁ బంతంబొనర్చి తానగ్నిఁ జొచ్చెఁ, బావకుఁడు దాని డాఁచి తప్పక దశాస్యుఁ
డెలమి సీతను గొంపోవ నెఱిఁగి వాని, కిచ్చె వేదవతిని సీత నీయకుండ. 337

వ. అంత నాదశాస్యునిజంపి వేదవతియను సీత నగ్నిప్రవేశించె నంత వేదవతి పద్మంబున నుండి యాకాశరాజేంద్రునికి లభించె, నే నద్దానింగని మరులెసంగి [illegible]ంబగు వాఁడ నయ్యాది నను మఱచిపోయె నంత. 338

మ. అని యమ్మాధవుఁ డాత్తతం దనరువృత్తాంతంబు పద్మావతీ
జననంబు న్వినుపింపఁగా వకుళ శ్రీస్వామి న్విలోకించి యి
ట్లనె నోదేవ మహానుభావ మును నే నజ్ఞాననై మానవుం
డని బాలుండని యుండి తేను నిను బ్రహ్మం బంచు సేవించెదన్. 339

శా. నీవే బ్రహ్మను గన్నతండ్రివి మహానిర్వాణసంధాత వీ
వే విష్ణుండవు రామచంద్రుఁడవు నీవే కృష్ణదేవుండవు నీ

వే వేదాత్మవు సర్వతోముఖుఁడ వీవే కర్త వాభోక్త వీ
వే విశ్వంబు వరాహదేవ యతవ నీవే శేషశైలాధిపా. 840

క. తోయజలోచన నే నీ, మాయను గనలేక నా కుమారుఁడ వంచున్
నీయందుఁ బ్రేమ ముంచితి, నాయాశుఁడ వంచుఁ దెలియనైతి మహాత్మా. 841

సీ. అన విని విష్ణుఁ డిట్లనియె నిచ్చట నీవు, తలగాయమును మాన్పి తల్లి నలెను
బోషింప నీబుణంబును దీర్చు టెట్లుకో, యని నేను జింతింతు ననుచు వకుళ
మాలికపై విష్ణుమాయఁ దెప్పవఁ గప్పి, పుత్త్రవాత్సల్యసమృద్ధి నిల్పి
మఱల నిట్లనియె నవ్వా వివాహము నాకుఁ, జేయు మీ వంచు మచ్చికలు వల్కి
తే. తప్ప కిప్పుడ పెండ్లి పెత్తనము చేయఁ, బోయి రమ్మని యల్క నా పొలఁతి హరిని
గాంచి పుత్రకి యిప్పుడా కన్యయున్న, దివ్యపురమెట్టిదో దాని దెల్పుమయ్య. 842

తే. అనఁగ హరి యిట్టు లనియె నీయద్రి దిగువ, నమరు నమరావతీపురం బనఁగఁ బుడమి
నున్నతంబై ప్రకాశించు నొక్క నగర, మట్టి పట్టణ మిపుడు నీ వెట్టి దనిన. 843

సీ. వేదవేదాంగ ప్రవీణులై వేదాంత, వేత్తలై వెలసిన విప్రవరులు
ప్రవర బాహాశౌర్యపటిమజితారాతి, వారంబు గలభూమి వరమణులును
మణికాంచనోజ్జ్వలమందిరాంగణనట, ద్ధ్వజముఖాదికులు నైన వైశ్యవరులు
ధరనిర్జరులపాదసరసిజసేవైక, శుభధురంధరు లైన శూద్రఘనులు
తే. గలిగి విలసిల్లు గోపుర కలితలలిత, రత్నకాంతపరిభ్రాంతి రాజహంస
పథనిరోధకసాల విభ్రాజమాన, మై ప్రకాశించు నారాయణాఖ్యపురము. 844

ఉ. అప్పురమేలువాఁడు గని నాఖ్యధరాపతి చంద్రుఁడుత్తముం
డెప్పుడు ధార్మికుం డతఁ డభీష్టసుఖప్రదుఁ డంచు సజ్జనుల్
మెప్పఁగ నెన్నుచంద్రు కడు మేలుగ భక్తి విరక్తి యుక్తులం
దొప్పినవాఁడు దేవతచయోన్నతి సన్నుతిఁ జేయ నొప్పెడున్. 845

సీ. సప్తాంగములవెలి సవరించి యాత్మయం, దష్టాంగ సరణిపై నాసఁ బెంచి
శైటశాత్రవకోటిపటిమంబు నిర్జించి, యంతర్వైరోగుల నడఁగఁజేసి
బాహ్యపుణ్యనదీప్రభావంబు నీక్షించి, యాంతర నదులపై నాత్మ నుంచి
వెలుపలిచక్రము ల్వేడ్కతోఁ బాలించి, సాకిదిలో చక్రముల్ చూడనెంచి
తే. దీనజనమానసాధీన ధీరు విష్ణు, చరణకంజాత సంజాత సారమధుక
రాయమాన మనస్కుఁడై రహిని వెలయు, నెమ్మి నారంగ నాకాశనృపవరుండు.

[illegible]డమానుండు ముద్దుతమ్ముండు పరమ, భక్తియుక్తుండు శాంతుండు పరఁగఁ బుత్త్ర
[illegible] వసుధామ్నుఁ డని భార్య యోగ్యశీల, ధరణి దేవియనంగ పద్మావతిసుత,

ఉ. అని గగనక్షితీశ్వరుని యభ్యుదయంబును జక్రి చెప్పఁగా
విని వకుళాంగనామణి వివేకము మీరఁగ నద్రి డిగ్గి యో
వనజదళాక్షమార్గ మిఁక వారక చూపు మటంచుఁ బల్కె నె
మ్మనమునఁ జూపు దేవు వినుమాత కృపాన్వితధర్మపాలితా. 349

వ. ఇప్పర్వతంబు డిగి పోవ నచ్చట పావనకపిలతీర్థంబు పొందుగ గలదు. అద్దానియందు మునింగి కపిలమునివలనఁ బూజ లందఁబడిన శివలింగంబునకు నమస్కారంబు లిడి శ్రీనివాసునకు నతిశీఘ్రంబుగ వివాహలగ్నము సమకూర్పు మని వినుతించి యవ్వలం బోయి శుకాశ్రమంబు చేరి యందా శుకయోగీంద్రులకు మ్రొక్కి అగస్త్యాశ్రమంబున కరిగి యందమ్మునివలన నిర్మింపఁబడిన శివునకు నమస్కరించి తదాలయసన్నికృష్టగ్రామనివాసు లగు బ్రాహ్మణులకు మ్రొక్కి వారి నాశీర్వచనములను గూడి మైత్రి యొనరించుకొని నారాయణవనపురంబునకుఁ బోయి తద్రాజపత్నికడ కేగి యయ్యంగనామణిం జూచి ప్రియోక్తులాడుచు నావలఁ బద్మావతిసంగతి నించుక దెల్పించుము. జరుగు కార్యం బావల జరుగు ననిన వకుళమాలిక విని యిట్లనియె.

సీ. వినుదేవ! వారు నీ వృత్తాంత మడిగిన, నప్పుడే నేమేమి చెప్పవలయు
ననఁబల్కె నాయంబుజాక్షుండు గనుఁగొని, యనియె నో యమ్మ వా రడిగిరేని
వరచంద్రకులజాతా వసుదేవకులు ధాత్రి, తలమున నాతల్లిదండ్రులనుము
బలభద్రుఁ డన్న సుభద్ర సోదరియును, గోత్రమడ్గ వసిష్ఠగోత్ర మనుము
తే. రోహిణి నక్షత్ర మడిగిన శ్రవణమనుము, లలితయౌవనసౌందర్య కలితుఁ డనుము
మానధనుఁడను ధన్య నిధానుఁ డనుము, భువిని బద్మావతికిఁ దగు పురుషుఁ డనుము.

## వకుళమాలిక నారాయణవనపురమున కేగుట.

వ. అని చెప్పుచుండఁగ దేవమాయానిర్మితం బగుతురంగంబు రయంబున వారికడకు వచ్చి నిలుచుటం జేసి వకుళమాలిక సంతసించె నా చక్రితురంగంబునకుఁ దగునాజ్ఞ యిచ్చి వకుళ నాతురంగంబున నారోహింపఁజేసె. అంత నావకుళ చక్రి చెప్పినట్లు కపిలేశ్వరునకు నమస్కరించి ప్రార్థించి శుకునకు నగస్త్యులకు మ్రొక్కు లిడి శివలింగంబులకుం బ్రణమిల్లి మొక్కు యొడఁ గూర్చుండి తద్దేవాలయంబులో నిలిచియున్న కన్యకలయం దొక్క కన్యను జేరఁ బిల్చి ప్రియోక్తుల నిట్లనియె.

క. చెలి నీ వెవ్వరి దానవు, తెలువారఁగఁ జెప్పు మనినఁ జింతించుచు నా
చెలి మిన్నదాఁప కిట్లనెఁ, దెలువారఁగ వకుళతోడఁ జిత్తం బలరన్. 352

సీ. ఆకాశరాజేంద్రు నాత్మజ చెలికత్తె, నననా నవ్వకుళ దానిని బ్రియంబుఁ
జూచి యమ్మా! మోము సాక్షినట్లున్నది, యేమి చెప్ప ఘటన్న నామెలంత

దోడుకొనిపోదు నన దాని తోడుకొనుటకు, వకుళ యచ్చటనుండె నవ్వలఫణీంద్ర
శైలపు యప్పుఁ డతిమీది జాలిచేత, దీరుఁ దయ్యెను మదిని చింతించుచుండె. 358

అని చెప్పిన సూతుంజూచి శౌనకాదు లావలిచరిత్ర మేమన నతం డిట్లనియె. 359

సోమదివాకరలోచన, దామోదర శంఖచక్రధరభవహరసు
త్రామోద్ధారక గుణవర, శ్రీమ ద్వేంకటగిరీంద్రనిజసదనుజేంద్రా. 360

మాలిని. సురుచిరగుణధామా శుభ్రసత్కీర్తికామా
మురదనుజవిరామా మోక్షకల్యాణసీమా
గురుతరశుభనామా ఘోరసంగ్రామభీమా
ద్విరదకుముదసోమా దేవతాసార్వభౌమా. 361

గద్యము. ఇది శ్రీతతికుండ లక్ష్మీనృసింహ కరుణాకటాక్షకలిత కవితావిలాస వసిష్ఠగోత్రపవిత్ర కృష్ణయామాత్యతనూభవ వేంకమాంబాప్రణీతం బైన శ్రీవేంకటాచలమాహాత్మ్యం బనుభవిష్యోత్తరపురాణంబునం దిష్టదేవతాప్రార్థనంబును, శౌనకాదుల ప్రశ్నయు, జనకశతానందసంభాషణంబును, శేషమారుతసంవాదంబును, శేషాద్రిప్రమాణ భావంబులును, మాధవాఖ్యవిప్రునిచరిత్రయు, వేంకటేశ్వరుండు వైకుంఠంబును జేరుటయు, నారదుండు బ్రహ్మకు వేంకటేశ్వరుండు వైకుంఠమునకుఁ బోయినట్లు చెప్పుటయు, నారదుండు త్రిమూర్తులం బరీక్షచేయించుటయు, భృగుండు త్రిమూర్తుల గుణంబులు గనుటయు, హరితోడ లక్ష్మీదేవి ప్రేమకలహంబు పూని కొల్లాపురంబు సేరుటయు, హరి వైకుంఠము విడిచి శేషాచలంబున వల్మీకంబు నంజేరుటయు, బ్రహ్మరుద్రులు గోవత్సరూపంబులం జని హరికి నాహారంబు నొసంగుటయు, చోళరాజాంగన గోపకుని దండించుటయు, హరి శిరంబున గోపకుండు గొడ్డంట నలుకుటయు, చోళరాజుకు చక్రి శాపం బిడుటయు, గీష్పతి హరికి నౌషధంబు చెప్పి పోవుటయు, శౌనకాదులు హరిచరిత్రకుఁ బశ్చాత్తాపమొందుటయు, వల్మీకతింత్రిణీప్రభావంబును, శేషపర్వతమహిమంబును, వరాహశ్రీనివాసుల సంవాదంబును, హరికి వరాహస్వామి చోటిచ్చుటయు, వకుళమాలికా వృత్తాంతంబును, శ్రీమదాకాశరాజువృత్తాంతంబును, పద్మావతి భూమియందుదయించుటయు, వసంతఋతువర్ణనంబును, పద్మావతివనవిహారంబు సేయుటయు, నారదుండు పద్మావతితో సంభాషించి పోవుటయును, శ్రీనివాసుండు వేటాడుటయు, హరి కరినిరీక్షించుటయు, వనమధ్యంబునఁ బద్మావతిని హరి చూచి తనయా వంతంబంతయుఁ జెప్పుటయు, పద్మావతి కలహించి చెలులచేత హరిపై ఱాల రువ్వించుటయు, హరి గిరికేగి వల్మీకంబునఁ జొచ్చుటయు, వకుళమాలిక హరిని

ప్రియంబున మాటాడించుటయు, హరి యెట్టకేలకు వకుళకుం దన నిజంబు వక్కాణించుటయును, రామకథయు, వేదవతీవృత్తాంతంబును, నారాయణ వనపురవర్ణనంబును, పద్మావతిగృహంబున కరిగి హరిం దలంచుకొని తాపజ్వరం బనుభవించుటయు, వకుళ నారాయణ వనపురికేగి పద్మావతి చెలికత్తెం జూచి మాటాడుటయు ననుకథలంగల చతుర్థాశ్వాసము.



శ్రీరస్తు.

# శ్రీవేంకటాచలమాహాత్మ్యము

## పంచమాశ్వాసము.

విశ్వాతీతగుణాకర, విశ్వోద్ధర విష్ణుదేవ వేదవిహారా
విశ్వేశ్వర సురపూజిత, శాశ్వత తటిసదన్వహార జనహితకారీ. 1

సూత వకుళ దండశూకాద్రి దిగిపోయి, నప్పుడు విష్ణుదేవుఁ డద్రియందు
నుండి యే ప్రయత్న మొనరఁజేయుచునుండె, చెప్ప వలయు సూతుఁ జెప్పు మనిరి.
వినుఁడు మునులార హరిసేయు వింతలన్ని, చెప్పెదను మీకు నట్లన శ్రీధరుండు
వేంకటాచల మందుండి వేడ్కగాను, దాను దనమదిలో నిట్లు దలఁచె నెలమి 3
వకుళను నే నా వివాహప్రయత్నంబు, సేయనంపితి వారిఁ జేరి యచట
నెఱవుగా మాటాడ నేర్చునో నేరదో, పురుషుల పనులెల్ల పొలఁతిచేతఁ
బడుచు గల్గినవారు పట్టుగ నామాల, మెఱుఁగిఱు గనక నా కీయుదురు మఱి
బ్రాహ్మణ వటుమీఁదఁ బోఁగూడ దచటికి, యొకట సంధానమే కుదురవలయు
ననుచు యోచించి సర్వజ్ఞుఁ డయ్యనఘుని, కరణిఁ జింతించి తాను శీఘ్రముగ లేచి
యప్పుడతిఁ జూడఁ గోరి మోహంబుచేతఁ, దాశ నోపక యొక విచిత్రం బొనర్చె.
అవ్విధ మెట్టు లన్న వినుఁ డబ్జదళాక్షుఁడు జీర్ణవస్త్రముల్
నివ్వటిలంగఁ గట్టుకొని నెఱుపు మై నొకప్రాఁతకంచుకం
బవ్వల బాగుగాఁ దొడఁగి యవ్విధంబున నొంగి లేచుచున్
నవ్వుచుఁ గొండ డిగ్గి తన నాఁడెము లోకుల కెల్లఁ జూపుచున్. 5
దంతపుసొమ్ములు తగుబండి గురిగింజ, దండ లొప్పఁగ మెడ నిండఁ దాల్చి
సిరజభవు నేడు నెలల బాలుని చేసి, యాదరించుచుఁ బ్రక్క నంటఁగట్టి
శంకుటుంగరములు పొంకంబుగాఁ బెట్టి, తను వగు నొక్క బెత్తంబు పట్టి
యనుకొని నవధాన్యములు నించి యొకబుట్టి, శిరమున నిడుకొని శీఘ్రముగను
బోయి నారాయణాఖ్య సత్పురము సేరి, వెలఁగియాయూరి యమ్మలక్కలను జూచి
యెఱుక యెఱుకోయటం చెలుంగెత్తి పలుక, విని పురస్త్రీలు దాని బల్వింతగాను
వీక్షణమునఁ జూచి పలికిరో ముసలిదాన, గద్దె చెప్పుము మాకు నిక్కంబుగాను
ఇకగా నంతలో రాచ చెలులువచ్చి, యెఱుకతను జూచి వేడ్కమై నిట్టులనిరి.

ఆ. వనిత నీవు భాగ్యవతివి నేను గడుపేద, దానఁ గాన నాకుఁ దనయునకును
బాలు బువ్వబెట్టి పేరైన విడెము నా, కిచ్చి యనుగు మెఱుక యెలమిగులుక.

క. అప్పుడు క్షీరాన్నంబును, దెప్పున బిడ్డఁడును దానిఁ దిని లేచి ముదం
బొప్పఁగ ధరణీదేవిని, గప్పురవిడె మిమ్మటంచు గ్రక్కున నడిగెన్. 18

సీ. ఆయెఱుకలసాని కాధరణీదేవి, విడెమిచ్చి పల్కెనో చెలఁది మీఁది
యేదేశ మిపుడు మీ యిండ్లెడ నుండు మీ, యూరుపేరేమి మా యూరికేల
వచ్చితి వనఁగ న వ్వనితయుఁ జూచి సో, దెలసాని వ్వయుఁ బలికె నిట్లు
తెలియ విన్నా' విను మెఱుకులవారికి, నిండ్లొండుఁగలవు భూమీశవనిత

తే. గుడిసె లాడాకఁ గావించి కొన్నిదినము, లుండిపోయెదు వారల కూడు దేశ
ములయూరూరిదయితల కెఱుక సెప్ప, వలసి వచ్చితి వింటె మాకులగతులును

సీ. ఎఱుకవారల కిల్లు గుఱికట్టుగా లేదు, నొక్కచోటున్నది నిక్కముగను
పదియేడు నన్నాళ్లాలును బదియుఁ బం, ద్రెండుపదాఱును రెండునైన
శృంగపంక్తులుచేత నింగి కెగయుచుండు, నాఱుకొండలకు మీఁదైనకొండ
[illegible] శృంగములొప్ప వీక్షింపఁదగుకొండ, మూఁడేళ్లతోఁ గూడి మొనయుకొండ
[illegible] క్రోశులకును నట్ట నడిమి కొండ, పాము తనలోన నుండఁగఁ బ్రబలు కొండ
[illegible] రుపలీఁ దనరారి మెఱయు కొండ, తొంట మా పెద్దలున్నట్టి దొడ్డ కొండ 20

క. ఆకొండ మీఁద నిక్కము, మాకొఁపుర మెపుడు చెలఁగు మఱి జీవికకై
లోకుల కెఱుకలు సెప్పుచు, జోకగఁ బ్రదుకుము మేము సోదె లడుగుమా. 21

క. చెప్పెద ముందెదు ముత్తెము, లిప్పించుము నాకు ననుచు నెఱుకత తనతోఁ
జెప్పఁగ నా నృపసతి విని, యప్పుడె ముత్యము లొసంగె యానందముగన్. 22

ఆ. పసిఁడి చేఁటలోని పండు ముత్తెంబులా, గద్దె పొలఁతి నూచి కరము సాఁచి
ముత్తెములను బిసికి మూఁడురాసులు చేసి, మధ్యరాశియందు మనసు నిల్పి. 23

వ. ముమ్మాఱు నారానికిఁ జేనెత్తి మ్రొక్కి నోట, గంగాపుణ్యతీర్థంబులను గాశీ
గయాప్రయాగ ప్రముఖపుణ్యక్షేత్రంబులను, హరిహరబ్రహ్మాదిదేవతలను, బరాశక్తి
ప్రముఖానేకశక్తులను దలంచుచు మ్రొక్కి మఱియు నిట్లనియె 24

క. విను ధరణీ సతి యిచటికి, నెనయన దేవుళ్లు వచ్చి నిలిచిరి నీవిం
కను దక్షిణతాంబూలం, బును గొని రా మ్రొక్కు గద్దె బుట్టను దనరన్. 25

వ. అనిన విని దక్షిణతాంబూలంబులు వెట్టి గద్దెబుట్టకి మ్రొక్కి లేడి యెఱుకల
సానితో ధరణీదేవి యిట్లనియె. 26

తే. కొమ్మ నామదిలోనుండు కోర్కె నీవు, చెప్పు నీకొడుకున కంటె గొప్ప నిత్తు
నీకు దివ్యాంబరములను నమ్మి నిత్తు, దబ్బరాడకు నెఱుకత తలఁచి మనువు 27

క. అని పల్కంగ రాణిం గనుఁ, గొని యెఱుకత యిట్టు లనియెఁ గొడుకా మదిలో
ననుమానింపకు మిప్పుడు, ఘనతగ నీకోర్కెఁ జెప్పఁ గల నెసలారన్. 28

వ. అని చెప్పటంజేసి ధరణీదేవి దాని కెనుగుఁ బసిండిపీఁటం గూర్చుండఁ దనచేతి బెత్తం బయ్యింతిచేతి కిచ్చి తా నొకప్రక్క పట్టుకుని 'విఘ్నేశ్వరా వీరభద్రా మళయాళభగవతీ మధురమీనాక్షీ యామ్నాయాక్షీ కామాక్షీ కనకదుర్గాంబ చౌడాంబ జ్ఞానాంబ కొల్లాపురలక్ష్మీ మీరల్లరు వచ్చి మంచివా కియ్యారే వాకియ్యారే యని ప్రార్థించి యిట్లనియె. 29

క. దిక్కులు సూపక సతి నా, దిక్కున నీవిప్పుడు చూడు దేవరతోడే
నిక్కము సెప్పెద నీకని, నుక్కున నాయెఱుకలమ్మ మఱి యిట్లనియెన్. 30

వ. అవ్వో యవ్వ నీతలంచినతలంపు మేలౌ తాఁగంట దేవుళ్లు పలుకుమండారు, తలంచిన తలం పేమంటివా సెప్పెద విను నైతమ్మ బిడ్డంటె కడుపునూపుదు తోడఁబుట్టంటె భుజంబును సూపుదును నీవిట్లు తోడఁబుట్టు కడుగలేదు ఇట్లా బిడ్డ కడుగుసుండావు, ఆబిడ్డ ఆఁడుబిడ్డఁటావా మగ బిడ్డంటావా చెప్పెద సూడు కొడకా, యాఁడబిడ్డంటె నెవుసూపుదును మగబిడ్డంటె గడ్డంబునూపుదును, ఇదిగో యిట్టి మగబిడ్డ కడుగలేదు. ఆఁడబిడ్డ కడుగుసుండావే, అవ్వో యవ్వ ఆయాఁడబిడ్డకు నొకసింత కలిగుండాది ఆసింతయేమంటావా నిన్నటిదినము నీబిడ్డ వనాకేగినాది అడ తురగారూఢుండైన నల్లనయ్యను జూచి మోహించియుండాది యెంసుండి ఆనల్లనయ్య వచ్చినాడంటారా చెప్పెదను దల్లీ ఇదిగో యీ మూలనుండాఁడు ఆమూల తెలియలేదంటె యీడికి వాయువ్యబాగానబడి గెలతో మెఱయుసుండు బంగారుకొండమీఁద నుండేవాఁడె కొడుకా వాఁడెవండంటావా బొల్లినామంబులు పెట్టుకొని బొల్లిగద్ద నెక్కి కొల్లకాఁడై యెల్ల దిక్కుల దిరుగు నల్లనయ్యో తల్లి, వాఁడు నిబద్ధిగాను నారాయణుండె కాని నరుండుఁ కాఁడే యమ్మా వాఁడు నీబిడ్డను బెండ్లాడవలె నని యుండాఁడె వాని నీబిడ పెండ్లాడనెంచి యుండాది, కాఁబట్టి నీపుత్త్రికను ఆసామికిచ్చి పెండ్లిచేసి కన్నులార సూడుము తల్లీ సుకంగానుంటాది లేకుంటె కష్టాలు రాఁబోతుండాదె యమ్మ' యని చెప్పిన విని ధరణీదేవి యెఱుకతం జూచి సంతసించి యిట్లనియె. 31

క. ఓయెఱుకత నీమాటలు, మాయఁగఁ దోఁచినవి మనుజ మానినులను నా
రాయణుఁడు పెండ్లియాడిన, దీయవనిం గాన మెందు నిది నిజమేనా. 32

సీ. అని వింత పడి నవ్వి యడుగంగ నప్పుడా, యెఱుకలసాని తా నిట్టు లనియె
స్వామి మదకరి వదలించి తఱుముచు, వచ్చినీ సుతయున్న వనము సేరి
తనకులగోత్రము ల్తనకోర్కె నీముద్దు, చిన్నారిబిడ్డకుఁ జెప్పినాఁడు
నీపుత్త్రి యది విని నిష్ఠురోక్తులు పల్కి, యతఁ డెక్కి వచ్చిన హయముమీఁద

తే. బాల దర్శింప నేల గుణ్ణంబు వడిరొ, నతఁడు మన్నించి యావేంకటాద్రిఁ జేర
ముదిత నామీఁద మతికాము మూర్ఛదాఁకె, విరహతాపజ్వరంబుతో వేఁగసాఁగె.

తే. ఆజ్వరము మాన్ప వేఱ లేదౌషధంబు, కమలనయనుని మోము నీ కన్యకిపుడు
చూప నాలేమమిన్నకుఁ బాపమడఁగు, నూరకే నన్ను నడుగుట నొప్పఁగలదె?

తే. అనుచుఁ బల్కిన కొఱవంజి యవ్వఁ జూచి, ధరణిదేవి యిదేమిపో దబ్బ రనుచు
కమలలోచనుఁ డేడ మా కన్యయేడ, నతని యిది చూచుటేడ నీ వనుటకల్ల. 35

క. విన విన దబ్బరగాఁ దోఁ, చిన దిది యెప్పుడును లేనిచిత్రం బాహా
యన సెఱుకత విని యీవిధ, మనియెను నామాట దప్ప దవ్వో యవ్వా. 36

సీ. ఇఁకఁ గొంతతడవున కిచటికిఁ బెండ్లిపె, త్తనము సేయుటకు మోదంబుమీఱ
నా వేంకటేశ్వరుం డంపఁగ నొక యితి, వచ్చును నానిజ మచ్చు మెచ్చు
తెలియు నీకిపు డెంత తెలియఁ జెప్పినఁ గాని, దెలియలేదో ధరాదేవి నీకుఁ
దెలిసినప్పటికి నన్బిలిపించి బహుమాన, మిప్పించు మిప్పుడే మియ్యవలదు

తే. నాకిపుడు నీవు సెలవిమ్ము నీకొమార్తె, పెండ్లినాఁటికి వత్తు నాబిడ్డతోడ
మఱవకే నీకుఁ జెప్పిన మాట నిజము, దబ్బరని యెంచకమ్మరో తనయ నడుగు.

వ. అవ్వో యవ్వ కడుపుకూటికి దబ్బరాడితి నని తలంచి యుండావే, అది కల్ల గాదు కైలాటగాదు తరకట బరకటగాదు తబ్బిబ్బుగాదు, తసుకుకాదు తాటోటు మాటలుగాదు, ఆడంబరముగాదు, ఈడేలుగాదు, ఈఱలు తాఱలుగాదు, బొంకు గాదు, బోనకత్తైలుమాటలుగాదే యమ్మకూఁతునుజూచి యడిగితె నిజంబు దెలస్తాదె, నామాట నాగద్దబుట్టతోడె నాబుడకదుతోడె నిజమేగాని కల్లగాదు తల్లీ యని దిగ్గునలేచి పోయి పరమపురుషుండైన నారాయణుండు వేంకటాద్రియందు నిజరూపంబున నుండె నంత ధరణీదేవి పరమాశ్చర్యంబునఁ బద్మావతి కడకుం జని యిట్లనియె. 38

ఉ. అమ్మ యిదేమి పద్మ యిపు డారటఁ బొర్లుచుఁ బవ్వళించి యీ
సొమ్మసిలంగ నేల యిఁకఁ జెప్పవలే యిఁక నిన్నుఁ జూచి నే
నెమ్మది వెట్టు లుండెదను నీమదిలోఁ గల మర్మమిప్డు ని
ర్మమ్ముగఁ జెప్పు నీకలికి కన్నుల నీరిటు నించనేటికే. 39

క. నీవల దన్నను నిలునక, యావనమువ కరిగి నిన్న నాటాడఁగ ని
న్నావించుచుఁ గని రెవ్వరు, నీ వెవరిం గంటి వెవరు నీరజనేత్రా. 40

తే. నీవు బిడ్డవు నాకు నే నీకుఁ దల్లి, మఱుఁగు లేక చెప్పు నీయాత్మచింత
చింత దాఁపక యిఁకఁ జెప్పు జాగు సేల, యనిన నక్కన్య మాటాడ కడలసాఁగె.

క. ఆకన్యక యీవిధమున, శోకింపఁగఁ జూచి కొంత చోద్యపడుచు నీ
కీకరణిగ వతిదుసఖము, రాకకు గత మేమి దెల్పు రహి మాయమ్మా. 42

తే. అమ్మ నిజముగ లోకాన నాప్తు లింక, నాకెవరు లేరు నాకన్న నీకు లేరు
నన్ను నిజముగాఁ జూడ కున్న మాట, దాఁపకయ చెప్పుమిప్పుడు నా తండ్రితోడ.

చ. అని యిటు లానఁబెట్టి సుత నప్పుడు మెల్లఁగ లేవనెత్తి తా
ననుపమప్రేమతోడను నిజాంకతలంబున నుంచి శీర్షముం
దనచెయిదమ్మిచే నివిరి తద్దయు లాలనఁజేసి యడ్గగాఁ
దన తలవంచి పల్కెని సుతంగని యిట్లని ధాత్రిదేవి తాన్. 44

ఆ. పట్టి నీవు పాపఫలమును గాదిది, యరయ నేను జేసినట్టి పాప
ఫలముగాని నిన్ను బాధింప నేటికి, నంచు నీరు వెట్టె నత్తు లందు. 45

సీ. ఆరీతిఁ దనకొంత కార్తి బొందిన తల్లి, నా పడంతుక చూచి తాపమొంది
కనులబాష్పములొల్కఁగా నిట్టు లనియె నో, యమ్మ పుష్పవనంబునందు నేను
సఖులతో నాటాడు సమయాన నచటికి, దివ్యపూరుషుఁ డొక్కఁ డేజిమీఁదఁ
దగ నెక్కివచ్చిన నన్నుఁ గాంచి యొక్కఁప, క్కములాడె నేనట్టి గేలికప్పుడు

తే. జాల నవ్వించి తతనిపై నేల యతని, గుఱ్ఱమెగ్గెను మఱి యతండుఱ్ఱఁ బాఱి
చెచ్చెరోపోయె నాతని నిష్ఠగన్న, ఇట్టు లున్నది తల్లి నా యాసపడకు. 46

క. అని పద్మావతి పల్కఁగ, విని ధరణీదేవిసుతను వీక్షించి మనం
బున మోదము ఖేదము పెనఁ, గొనఁగా లజ్జించి ప్రేమ కూఁతురి కనియెన్. 47

సీ. నాతల్లి యీచిన్ననాఁట నీ కిటువంటి, బుద్ధి యేలజనించెఁ బుత్రి చూడ
వనమున కేగి యా వనపూరుషుని జూచి, వలచె నందుకు నిన్ను వనజవదన
పుట్టి పుట్టక తొల్లి పురుషస్వరూపంబు, నీ కట్లు దలిచెనే నీలవేణి
వానికులంబేమొ వానిపై నీకింత, మఱులేల కల్గెనె మధురవాణి

తే. కటకటా ! మానధనుఁడు నిన్గన్న తండ్రి, నీమనోవ్యధ నిజముగ నేఁడు వింటి
చింతచేఁ దలయెత్తలే కింత మదిని, గుందుచును దీని కే త్రోవ గుట్టుగాదె. 48

క. వనమున సుందరపురుషుని, గనుఁగొని మదిలో వరించె గాఁ గూఁతురటం
చను రాజా నవరె లోకులు, వినవలయుఁ గదా మఱింక విధి కేమందున్. 49

క. లోకం బంతయు మాయను, మూఁకుఁడు లే దతని నేల మోహించితివే
కూఁతుర మాకును నీకును, బ్రాకటముగ మించె కీర్తి రాఁగలదె మహిన్. 50

సీ. అని యిట్టు పలుకఁగ నపుడు పద్మావతి, హరి పూర్వవృత్తాంత మాత్మయందుఁ
దలఁచి యిట్లనియె నో తల్లి నీ కపకీర్తి, వచ్చును నను చింత వలదతండు
మనుజమాత్రుఁ డటంచు మది నెంచి నావేమొ, మనుజుండు గాఁడు గమావిభుండు
పురుషోత్తముండు సంపూర్ణప్రకాశుండు, సర్వజ్ఞుఁ డాద్యుఁడు శాశ్వతుండు

తే. గాన నాస్వామి యతఁడు నా మానసంబు, కుదిరి నిలిచిన దది నాకుఁ గొదువగాదు
నాతోఱు భూమి నపకీర్తి మాకు లేదు, కావలసినట్టి పను లింకఁ గాకపోదు. 51

వ. వినుము జననీమతల్లి చింతమాను మే మహామహుని దివ్యచక్రంబు కారణబలంబులం గ్రుంచి కరివగరంబున ధర్మరాజును పట్టభద్రుం జేసి తత్పురసంరక్షణంబు సేయుచుండు, నేమహాత్ముని శంఖారావంబు దైత్యబృందంబునకు భయప్రదంబై దేవతల కానందంబు నిచ్చుచుండు నట్టి శంఖచక్రధరుం డైన పరమపురుషుండు లీలామానుషవిగ్రహుండు నై నిన్న నవ్వనంబున నాకుంగాక చెలులకుంగూడ దర్శనం బిచ్చినవాఁడు నే నీమర్త్యలోకంబున నుండఁదగినదాని కాతనియందు దాలురవ్వించితి నయ్యపచారం బేనుజేసినందుల కమ్మహావిష్ణుండు నన్ను రక్షించునో రక్షింపఁడో యనుసందియంబును భయంబును బెనఁగొని కన్నీరునించుటయ కాని కామవికారవ్యాపారంబు నాకింతకేల శ్రీనివాసుని దివ్యమంగళరూపంబు నాకు నగుపడకుండినఁగో నుసురులఁ దొఱంగెదఁ బ్రత్యక్షంబైనఁ బ్రాణంబు లుంచుకొనెద నని పూలపాన్పునందు వ్రాలుటం జేసి చూచి ధరణీదేవి యచ్చెరువంది యిట్లనియె.

సీ. అమ్మపద్మావతీ హరిభక్తి నీచిత్త, మం దింతగా నిల్చినందువలన
నీకోర్కె సిద్ధించు శోకింప నేల దీ, క, నాచక్రి నినుఁ బెండ్లి యాడు ననుచు
దేటగ నొకధర్మ దేవత వచ్చి నా, కెఱుఁగఁ జెప్పినమాట లేలదప్పు
దప్ప దిప్పుడు నీవు ధైర్యంబుతో నుండు, మని చెప్పుచుండఁగా నంత నటకుఁ
తే. గ్రమముగా విప్రముఖ్యు లగస్త్యలింగ, మునకు రుద్రాభిషేకంబు దనరఁజేసి
పరఁగఁ దత్తీర్థమును బూలు పత్రి పండ్లు, కోరి గైకొని రాఁజూచి వారితోడ. 53

తే. చెలులతోఁగూడి గుడినుండి చెలిమి దనర, వకుళమాలిక పల్కుచు వచ్చె నపుడు
ద్విజులు రుద్రాభిషేకస తీర్థమమరఁ, జల్లి పద్మావతిశిరంబు నుల్లసముగ. 54

తే. పూలు మంత్రాక్షతలు పండ్లు పాలఁ తికిచ్చి, దీవన లొసంగి వోయిరి వేగ పెండ్లి
యగునటంచును వకుళను నపుడు వేఱ, వనితగానుంట గనుఁగొని మనమునందు.

క. ధరణీదేవి రయంబునఁ, బెరిమను దోడ్తెచ్చి రత్నపీఠమునందుం
గరిమర్థి నునిచి వకుళను, గురుతర వినయంబు నడిగెఁ గూర్మియొసంగన్. 56

సీ. అమ్మ నీవెవ్వరికై వచ్చితివి యిట్లు, లెందుండి వచ్చితి విటకు నెలమి
సచియింపు మనఁగ న వ్వకుళమాలిక యిట్టు, లనియె నోయమ్మ శేషాద్రినుండి
వచ్చితి ననఁగ నెవ్వరిదాన వనిధర, ణీదేవి యడుగఁగా నిక్కమేను
ధరవేంకటేశుని దాననై యుందునా, స్వామి పంపించఁగ వచ్చి తిచటఁ
తే. జేరినానని వకుళ మెచ్చికను బల్క, విని మహీపతి సతియేమి పనికినీవు
వచ్చినావని యడుగఁగ వకుళయేను, బెండ్లిపెత్తనముగ వచ్చెఁ బేర్మిఁ దనర. 57

క. అని పల్కిన వకుళను గనుఁ, గొని ధరణీదేవి యెవరి కొఱ కిప్పుడు పె
త్తన మిచటఁ జేయ వచ్చితి, వని యడుగఁగ వకుళ యిట్టు లనియె ముదమునన్. 58

